శ్రీ శివాయ గురవేనమః

శ్రీ

# శంకర శతకము

రచన:

**చాగంటి సుందరశివరావు**



1963

## శ్రీ శివాయ గురవేనమః

మా పితామహులైన కైలాసవాసి శ్రీ **చాగంటి సుందరశివరావుశర్మ** గారు ఈ శతకమును రచించిరి. వారు పరమ శివభక్తులు అనేక శాస్త్రముల యందు నిష్ణాతులు. వారు వివిధ సందర్భములలో, భావావేశమును శివునకు పద్య రూపములో విన్నవించిరి. **శంకరా** యన్న మకుటమును గల్గి, **శ్రీ శంకర శతకమని** ఖ్యాతి గాంచినది. మాతాతగారిని దర్శించు భాగ్యము నాకు లేకపోయినది. మా తండ్రిగారైన బ్రహ్మశ్రీ **కోటేశ్వరశర్మగారు** 4 సంవత్సరముల పిల్లవానిగా నున్నప్పుడే మాతాతగారు దేహత్యాగ మొనరించిరి. మా నాయనమ్మ గారు, కైలాసవాసి **శ్రీమతి సుశీలమ్మగారు** నాకు తరచుగా మాతాతగారి భక్తి, దానతత్పరత, నిరాడంబరత వినయసంపదలను గూర్చి చెప్పుచుండెడివారు. మా తండ్రిగారు వారి ఉపన్యాసములలో తరచు మా తాతగారి పద్యములను వుటంకించెదరు.

పై రెండిటిచే ప్రభావితుడనైన నేను, ఈ గ్రంథమును పునర్ముద్రణ చేయించవలెనని సంకల్పించితిని. నా తల్లిదండ్రులకపార సంతోషమును కల్గించు ఈ పని చేయగలుగుట పరమేశ్వర కృప.

ఈ పునర్ముద్రణలో నాకపారముగా సహకరించినవారు, పితామహ సమానులు గౌరవనీయులు డా॥ శ్రీ టి.ఎస్.ఎన్.మూర్తిగారు. నా వెన్నుతట్టి ప్రోత్సహించిన వారు, దైవసమానులు శ్రీగోపాలకృష్ణ తాతగారు. వారికి నా నమస్సులు. అతి తక్కువ కాలములో ముద్రించి అందించిన మోహన్ ఆఫ్‌సెట్ ప్రింటర్స్, కాకినాడ అధినేత శ్రీ మధుమోహన్ గార్కి, నా కృతజ్ఞతలు.

**కాకినాడ**
**దీ. 25-10-10**

**బుధజన విధేయుడు.**
**చాగంటి షణ్ముఖాంజనేయ**
**సుందరశివ చరణ్‌శర్మ**

శుభమస్తు

శ్రీ శివాయ గురవేనమః

# శ్రీ శంకర శతకము

శా. శ్రీ శర్వాణి నిజాంకమందు నగుచున్, జెన్నొంద లంబోదరుం
డీశాదక్షిణసక్తి దేహమున దా, నింపారియుండంగ రా
త్రీశుం డుత్తమదేహమందు వెలుగుల్, రంజిల్లగానొప్పు నో
కాశీనాథ యొసంగ వేడెదను నా, కామ్యార్థముల్ వేడ్కతో.

--: గణేశ స్తుతి :--

ఉ. వందన మీశుపుత్ర శుభ, వందనమిందు సమానగాత్ర నా
వందన మేకదంత యభి, వందనమో కరుణాహృదాంతరా
వందనమాఖువాహన సు, వందనమో సురదైత్యపూజితా
వందనమోయి విఘ్నపతి వందలు వందనముల్ గ్రహింపుమా.

--: గురు స్తుతి :--

శా. శైవాచారపరుండు శిష్టజన సం, సేవాభిలాషుండు స
ద్భావోపేతు డుదారచిత్తుడు మహాపంచాక్షరీమంత్రము
న్నే వేళన్ జపియించు పుణ్యుడనఘుం, డీశానుసద్రూపుడా
జీవన్ముక్తుని మల్లిఖార్జునగురుఁ, సేవింతు నశ్రాంతమున్.

--: ప్రార్థన :--

మ. శతకంబేను రచింపబూనితి భవత్సాయం బపేక్షించి యో
సతతానంద ఘనస్వరూపహర మ, త్స్వాంతంబునన్నిల్చి రా
జితశబ్దామృతధారలొల్క గవితఁ జేకూర్పవే ప్రజ్ఞతో
పతితోద్ధారక పార్వతీరమణ నాపద్యంబులన్ శంకరా. 1

--: అంకితము :--

శా. శ్రీగౌరీహృదయేశ గైకొనుమిదే చెల్వొందు నాసత్కృతిన్
బాగోగుల్మదిలో తలచక కృపాపారీణ గంగాధరా
భోగానందభుజంగహార శివశంభూ నాగచర్మాంబరా
శ్రీగీర్వాణకదంబవందిత పదా శ్రీశాంభవీ శంకరా. 2

ఉ. స్వాగతమాదిదేవ హర, సాంబసదాశివ గౌరినాథ వే
స్వాగతమిందుశేఖరుడ, సామజచర్మకపాలభూషి తా
స్వాగత మబ్జనేత్ర భవ, సాధుజనార్చిత శాంభవీశ్వరా
స్వాగతమయ్య స్వాగతము, సాదరమొప్ప గరమ్ము శంకరా. 3

మ. చదువాస్వల్పము శాస్త్రమా యెరుగ, సచ్ఛందసస్సంపూర్ణమో
మదనాకుంఠితగర్వభంగ మరియే, మంత్రార్థతంత్రార్థముల్
మొదలేనేనెటనేర్వలే ధవనీ, మూలంబునఁ గాదె నే
పదముల్గూరిచి పద్యమల్లుటది సంప్రాప్తించెనో శంకరా. 4

మ. మతమా శైవము పుట్టుకాయదియె య, స్మత్పార్థనానిన్నెగా
నతినైచ్యంబగు తృష్ణరోగములచే నత్యాధులంజిక్కి నా
మత సిద్ధాంతము లెవ్వియో యెఱుగనా, మానుష్యముంబాపి నే
సతతంబున్ భవదీయపూజనలుపఁ సంధింపుమో శంకరా. 5

ఉ. అక్షరమాల దిద్దుకొను నర్భకునొక్కని నాదియందు తా
శిక్షణజేయబూని బహుశిక్షలొసంగు గురుండు కైవడిఁ
రక్షకుడైన నీవె నను రక్షణజేతువటంచు నమ్మితిఁ
కక్షవహింపకయ్య ననుగావుము భక్తుడనయ్యు శంకరా. 6

శా. నీవే మూలము సర్వశాస్త్రములకుఁ నిద్రాద్యవస్థాత్రయిన్
నీవే మూలము విశ్వసృష్టికి మఱిన్, నృత్తాదిగీతాలకున్
నీవే మూలము యజ్ఞతంత్రకవితా నేత్రావధానంబులఁ
నీవే మూలము నాదుగీతములకుఁ నిక్కంబుగా శంకరా. 7

శా. నీసంకల్పము వర్ణనీయముగదా, నిష్కామయోచింప తా
వీసంబేవిము మేరమీర వ్యథదుల్, వీచున్ సదామారుతం
బే సుం తేనియు మార్పులేక మలగున్, న్నింపారభానుండుతాన్
నీసంకల్పము నెన్ననాదువశమా నిక్కంబుగా శంకరా. 8

శా. మండూకక్రియలోభమోహమద కా, మక్రావృతాత్ముండనై
చండీశప్రభు మున్గియుంటిని మహా, సంసారకూపంబులో
గొండంతాసతో గోరుచుంటి నిను నా, క్రూరత్వలోభాకృతిన్
జండాలుఁ దరిజేరనీక దరుమఁ, సాధింపుమో శంకరా. 9

శా. శంభోశంకర శాంతసత్త్వసుగుణా, సంశోభితాకార యా
యంభోజాక్షి పురందరాదివినుతా యద్ర్యాత్మజాసంయుతా
గంభీరోన్నతిశైలరాజనిలయా, గంధర్వ సంసేవితా
శుంభద్గర్వవిదూర గావు మికనన్ శంకరా. 10

శా. వర్షాకాలము వచ్చునంచు గృహముల్, బాగొప్ప నిర్మించితాన్
హర్షంబొప్ప సమస్తవస్తుతతి నా, న్యాయంబునన్ గూర్చు నా
కర్షప్రాజ్ఞుని మాడ్కి మృత్యువతి శీ। ఘ్రంబేర్చునంచుఁ సదా
హర్షోత్సాహముతో భవత్పదము తా। మర్చింతురా శంకరా॥ 11

శా. కన్నుల్గల్గియు కాననట్లు జగమున్। గాఢాంధకారంబునన్
నిన్నున్‌జేర వివేకముండియు సదా। నీచింతయే లేక నే
కన్నుఁమిన్నున్ గానరాకబడితిఁ। గామాంధకారంబునన్
నిన్నున్ వేడెద నిత్యమీయగదవే। నీదాస్యమో శంకరా॥ 12

శా. ఆపద్బంధుడవీవు నిక్కముగదా। యాపన్నుడఁ దీనుడఁ
దాపవ్యాహతిదారుణాగ్ని బడితిన్, ద్యానంబిదే జేతునిన్
పాపౌఘంబుల బారతోలితినను నీ। భక్తావళిఁ జేర్పవే
నీపాదంబుల నమ్మినాడనిక నే। నీవాడనో శంకరా। 13

శా. రారా విష్ణువిధాత పూజితపదా। రారా మునీంద్రస్తుతా
రారా దీనశరణ్య పాదకమలా। రారా దయాంభోనిధి
రారా ఫాలకనేత్ర కామదహనా। రారా త్రిశూలధరా
రారా భక్తపరాయణా పశుపతీ। రక్షింపుమా శంకరా॥ 14

శా. నిన్నేనమ్మితి నీదుపాదమెపుడుఁ నిక్కంబుగా గొల్చెదన్
నిన్నే నామనమందపారనిరతిన్। నిత్యంబునే నిల్పెదన్
నిన్నే గొల్తును సర్వభారములొగిన్। నీపై బడన్వైచి నే
నిన్నేనమ్మితి నన్ను గావగదవే। నీవాడనో శంకరా॥ 15

శా. ఆర్తత్రాణ పరాయణుండవని ని। న్నర్థింతురే సద్బుధుల్
మ్ముమ్మూర్తుల్కుగ్గురసాధవీవెయని స। మ్మోదంబు జూపింతురే
కర్తవ్యంబెరుగంగదెల్పుమని నిన్। గాక్షింతురే నిర్జరుల్
మూర్తీనన్ గృపజూడరమ్మనిశమున్। ముఖ్యార్థినో శంకరా॥ 16

శా. యే యే ధర్మము లాచరింపనగునే। యేక్షేత్రమున జూడనౌ
నేయేతీర్థములఁ వశింపనగునే। యేకర్మముల జేయనౌ
నేయేపుణ్యవనాళి జేఁనగు నా। యీ పాపముల్ బోవగా
శ్రేయోబంధురసార్వభౌమవరదా। శ్రీ శాంభవి శంకరా॥ 17

శా. నీవే నాకికదిక్కు సాంబశివ నే। సత్యంబు నిపాద సం
సేవాభాగ్యము గోరుచుంటి। గరుణా। సింధుండవై కావవే
రావే నా మొఱయాలకింపవె హరా। రాజీవనేత్ర త్రయా
దేవా భక్తపరాయణా। పశుపతి, దీనార్థినో శంకరా॥ 18

శా. భక్తిఁ మెచ్చితి విచ్చితీవు వరముల్। భస్మాసురున్ శీలముఁ
యుక్తిఁ జన్మము జూడకుండ తపమున్ యుక్తిఁమహోత్సాహమున్
శక్తిన్గాంచి మృకండసూనుని యభి। ష్టంబుల్ తగఁగూర్చితే
యుక్తాయుక్తములెంచవీవకట భక్త్యుద్రేకవై శంకరా॥ 19

శా. పాతివ్రత్యమహత్మ్యమోయభవనీ, ప్రజ్ఞావిశేషంబదో
భీతోత్పన్న విషాదచేష్టయొమరిన్। ప్రేమంపు నీలీలయో
మాతృత్వంబిడి యత్రిపత్నియొడిలో। మౌనీంద్రపుత్రుండవై
నీతో ముగ్గురుగూడి యేకతనువై, నీవుండుటల్ శంకరా॥ 20

శా. శ్రీవిష్ణుండు సహస్రపద్మముల నిఁ। సేవార్చనల్ సల్పుచో
భావానందముసన్నగిల్లె నొక స। త్పద్మంబు తగ్గంగ తా
నీవే మూలమటంచు నమ్మి రయముఁ నేత్రంబె పద్మంబుగా
దేవా నీదు పదార్చనల్ సలిపెగా। ధీమంతుడై శంకరా॥ 21

--: వ్యాసుడు :--

శా. వేదంబుల్ విభజించి శిష్యులును దా। వేంచేయగా కాశికిన్
మోదంబొప్పగ బాదరాయణుడు, మున్। ముక్కంటి నీవంత నా
హ్లాదంబందకమౌనిచిత్తము పరి। క్లార్థంబు బాధించితే
ఖేదంబందెను బిక్షకై నిను మదిఙ, గీర్తింపమిఙ, శంకరా॥ 22

శా. పట్టెడన్నముగూడ కాశిక నల। భ్యంబౌటచే కోపముఙ
బట్టంజాలక వారణాశిని శపిం। పఙ బూన నీవంత నా
రట్టుంగాంచి మహేశ్వరిన్ బనిపిరా। రమ్మంచు నావ్యాసునిన్
దిట్టంగొట్టక నోగిరంబడితివే। దిట్టంబుగా శంకరా॥ 23

ఉ. రంజితుడై నశిష్యమను రక్తి భుజించిన వ్యాసమౌళికిన్
కంజదళాక్షి నీమగువ। కర్ణకఠోరపు శాపమీయగా
రంజనవీడి మౌని దన। రారుచువేడె నిజాపరాధముల్
భంజనచేసి దక్షపురి। బంపితి బార్వతిగూడి శంకరా॥ 24

ఉ. పాపుడ పాపసంభవుడఁ। బాపములే యొడిగట్టుచుంటి నా
బాపములన్నియున్ బతిత। పావన మానవు నీడవోలె నా
దాపును వీడకున్నయవి। తావక దాస్యమొసంగి నీవునన్
బాపవిముక్తు జేయుమిక, భారము నీయదిసుమ్మి శంకరా॥ 25

ఉ. చంద్రశిరోవిభూష శివ। శాశ్వితశర్వయ నాథనాథయా
నందఘనస్వరూప శుభ। నందితురంగ తమఃపతంగ యో
గీంద్ర సురాదివంద్య భుజ। గేంద్ర విభూషితదివ్య దేహ యా
నందమొసంగి నన్ను కరు। ణన్ గనుదోయినిగాంచు శంకరా॥ 26

ఉ. భారమునీదెసుమ్మి నను, బాలనుముంచిన నీటఁముంచినన్
భారములేక నీదు మృదు। పల్లవపాదపయోరుహంబులన్
కోరిభజింతు నిత్యమును, గోమలనాహృదయాంతరంబునన్
భూరికృపాంతరంగ సుర। పూజిత పారగణేశ శంకరా॥ 27

ఉ. తల్లియు దండ్రియున్ గురువు, దాతయు దైవము నీవటంచు నీ
పల్లవపాదయుగ్మముల, బాయక నిత్యముగొల్తుమన్న నే.
నొల్లనికామరోషముల, యొత్తిడిచే మనసొప్పకుండునా
దొల్లిటికర్మమా? యికను, దోలుము దోషములున్న శంకరా 28

ఉ. శ్రీభువనాధినాథ యఘు శీలుడవై నినువేడుచుంటి నా
క్షోభను నాలకించి పరి శుద్ధమనస్కునిజేసి నిత్యమి
లోభమదాదిచోరులకు, లోబడకుండగ గావుమయ్య నీ
శోభితపాదదాసుడను, శోధనజేయకుమయ్య శంకరా॥ 29

ఉ. తల్లినిబాసియుండుటన, తల్లడుచుండెను గుండెకాయ నా
వల్లనుకాదటంచు బెజ వాడను వీడితి దానితోడ నా
యుల్లము శాంతిబొందెనిక యూడెను యున్నతివిద్యయంతయున్
తల్లి యశాశ్వతంబు, తమదాస్యము శాశ్వతమయ్య శంకరా॥ 30

ఉ. పండితుడనైననేమి కడు, పామరుడడైన పవిత్రుడైన పా
షండమనస్కుడైన నతి సజ్జనుడైనను దుష్టుడైననున్
భండనవీరుడైన సుర పాలకుడైన నరేశుడైన నీ
యండను గోరువారెగద, యద్భుతవిగ్రహ యాదిశంకరా॥ 31

ఉ. నమ్మినవాడ నిన్ను శర ణంబని గావవదేల భారమా
నమ్మి భవత్పదాబ్జముల, నాయెదనిల్పి నమస్కరింతు నిన్
నమ్మినవారినెల్ల శర ణంబిడి బ్రోచితిగాదె వేడ్కతో
నమ్మితి నేనుగూడ శరణంబని గావవదేల శంకరా॥ 32

ఉ. నిందలపాలుజేయుటకు, నీవె తలంచిన యవ్వరడ్డమో
యిందుకళావతంస యిటు లేనపకీర్తులు బొందుచుండ నీ
కెందుకురాదు సుంతదయ, యేమరియుండుట నీకుభావ్యమా?
వందనమేనొనర్తు నను, వంచనజేయకుమయ్య శంకరా॥ 33

--: బోయ తిన్నడు :--

ఉ. పుక్కిటనీరమున్ వివిధ। పుష్పఫలంబులు పచ్చిమాంసమున్
మక్కువతోడదెచ్చి తమ। మజ్జనమర్చన యారగింపులన్
మిక్కిలిభక్తితో నెఱపు, మీపదదాసుని తిన్ననిన్ సదా
మక్కువ నాదరించితివి, మార్గము నాకికజూపు శంకరా॥ 34

ఉ. ముప్పునుముందు తానెఱిగి। ముందరవెన్కల జూడకుండ తా
నొప్పుగ నీప్రసాదమున నుప్పనియూదె మృకండుసూతి నా
దప్పుల నెంచకుండ శుభ। దాయక వానిని దిద్ది నాకు యే
ముప్పులు లేక గావుమిక, ముక్తికి మార్గము జూపి శంకరా॥ 35

ఉ. వేకువయందులేచి కడు, వేడ్కతో కొక్కొరొకోయటంచు చీ
కాకును జెందకుండ తన। కంఠమునెత్తి పిరంగి కైవడిన్
చీకటిబోయెనంచు తన। చెంతనయున్న జనంబు లేపు నా
వాకిటతామ్రచూడ మొకఫక్కిగ నీమముచేసి శంకరా. 36

ఉ. వేసవియందు వేడి బహువింతయు జీవికి శీతగట్టు యీ
మాసములందు వర్షమది, మానదు సైచుట కష్టమింతకీ
దోసము నాదిగాదు యవి, దోలుట నీదగుకృత్యమంచు నే
వీసము నీతిలేక ఫలవించితి సైపుము నన్ను శంకరా॥ 37

ఉ. వందనమిందుశేఖరుడ, వందనమోయి యనంగనాశకా
వందన మాదిదేవ శుభ। వందనమో జగదేకకారణా
వందన మార్గరక్ష సుర। వందితపాద కుబేరమిత్ర మా
వందనమద్రిచాప తమ। వాడను గావుము వేగ శంకరా॥ 38

--: శివ తాండవము :--

ఉ. వీణను వాణిమీట నల, విష్ణువు మద్దెలదిద్ద యింద్రుడున్
వేణువునూద బ్రహ్మ లయ। వీడక తాళమువేయ లక్ష్మియున్
త్రాణకొలంది రాగమును। రాల్గరగంగను దీయరాణి శ
ర్వాణి సమక్షమందు గడు। వాంఛను నాడుదువీవు శంకరా॥ 39

ఉ. నమ్మితి నాగభూష నిను। నమ్మితి నాట్యకళాప్రపూర్ణ నే
నమ్మితి నిర్వికల్ప నిను। నమ్మితి నామనసార నిన్ను నే
నమ్మినవాడ వీవెయని। నమ్ముచుకోరి జపింతు నిత్యమున్
నమ్మి యదార్థమున్ గనికరమ్మున గావుము నన్ను శంకరా. 40

ఉ. రమ్ము యుమామహేశ యిక। రమ్మిటు రాజశిరోభూషకా
రమ్ము రణప్రసిద్ధ యిటు। రమ్ము చరాచర సృష్టికర్త భా
రమ్మువహించ రమ్ము నను। రక్షణజేయగరమ్ము నిత్యమున్
రమ్ము రమేశసేవిత కరాంజలులిచ్చెద। నయ్య శంకరా. 41

ఉ. అర్ధశరీరధారియయి యర్చనజేసె భవద్పదద్వయం
బర్ధినటంచు నిన్ను వృషభాశ్వము తానయిమోసెగాదె సే
వార్ధము తామృదంగమును హాయిగవాద్యమొనర్చెయీా క్రియన్
స్వార్థములేకనిన్ను హరిసంతసవృత్తియజించె శంకరా. 42

ఉ. దానముజేయ నిర్ధనుడ, దార్ఢ్యము లేదు జనంగ యాత్రకున్
మానసమాగదే తపసి, మార్గమునన్ జరియింతునన్నచో
స్నానము నీమముందుదల్, సాధ్యముదుర్బలదేహమౌటచే
మానకజేతునీజపము మాత్రము శక్తికొలంది శంకరా. 43

ఉ. నమ్మినవానినెప్పుడును, నాశముజేయుట పాడిగాదు మో
దమ్మున వానికెప్పుడును, ధైర్యముగూర్చిభరింప బాడియౌ
క్రమ్మినమబ్బులన్విరిచి, కాంతితొ వెల్గెడు భానుమాడ్కి దో
సమ్ములుబాపి నన్నిపుడు, సాకుము దాసుడనయ్య శంకరా. 44

ఉ. భావ్యమె? బాణలింగ ననుబాధలు బెట్టుట నీకున్యాయమా?
సవ్యమె? పార్వతీరమణ! సత్కృపనేలక సంచరించుటల్
భవ్యుడవీవెయంచు తగు, భారము నీపయినుంచి వేడెదన్
కావ్యపురాణవేదనుత, కావుము నన్గడువేడ్క శంకరా. 45

ఉ. చంద్రకళావతంస మన। సార భవత్కృపగోరుచున్ దయా
సాంద్రుడవంచు నిత్యమును। సత్పదసంస్తుతిజేతునయ్య నా
గేంద్రవిభూష। నాదమల। హృత్పదమందు నటింపవయ్య యో
గీంద్ర సురాదివంద్య। కమనీయశరీర గిరీశ శంకరా. 46

ఉ. దర్శనమీయవేడెదను, దాసుడగానని యూరకుంటివా?
స్పర్శముగోర నే తగన? సాధ్యముగాదని సాకుగొందువో
దర్శనభాగ్యమేనిడగ, ధన్యతనేగొనలేద? నిక్కమా?
దర్శనమీయకున్నసరి, తావక దాస్యమొసంగు శంకరా॥ 47

ఉ. ఎన్నిభవంబులెత్త తుద, కీనరజన్మము లభ్యమయ్యెనో
పన్నగభూష నన్నికను, బాపవిముక్తునిజేసి జన్మమం
దెన్నడు సత్యశౌచములు, నెందునుమానక నీపదార్చనల్
మన్ననదోడజేసి పర, మార్గముబొందక జేయు శంకరా. 48

ఉ. జన్మములన్నిటన్ మనుజ, జన్మమెగొప్పది యెంచిచూచినఁ
సన్మతితోడ నిన్నెపుడు, సంతసమొప్పభజింప వీలగున్
సన్మునులండజేరి తమ, సన్నిధిపొందు తెఱంగెరుంగనౌ
మన్మథనాశయీశ యిక, మార్గము ముక్తికిజూపు శంకరా. 49

ఉ. ఈశుపురత్ర యీశ పరమేశ గిరీశ సురేశగావవా
పాశుపతాస్త్రధారి సురభాగ్యవిధాత యుమామహేశ భూ
తేశ జగత్రయీశ వృషభేశ గణేశసమేతకాశి వి
శ్వేశనటేశ రాఘవజనేశనుతా కృపజూపు శంకరా. 50

ఉ. చావనచింతయేల మన। సా యిక చావకనిల్చి యుందువా?
చావనమృత్యువైతనర। సాధ్యమె దానిని గెల్వనేరికిన్
గావునమృత్యువుఁ గెలువ। గా బరమేశ్వరపాదపద్మముల్
భావమునందునిల్పి బహు। భక్తినిగొల్చుటెదారి శంకరా. 51

ఉ. పాలనసేయవే పతిత। పావననామ హరాయటంచు నే
కాలము కాశియందు తమ। కాలము బుచ్చెడి భక్తితత్పరుల్
బాలకులైననేమి కడు। పాపభయంకరు మూర్ఖులేమి? నీ
పాలనలోనివారుగద। పాయకగాతువు వారి శంకరా. 52

ఉ. జేసితి పుణ్యమో యఘమొచెప్ప నశక్యమదెంత వారికిఁ
జేసినదెల్ల బాపమని జిత్తమునందు దలంచి వేడెదన్
వాసిగవారణాశిపురవాస భవత్కృపజూపి నన్ను నీ
దాసులలోనజేర్చుమిక తప్పదు జాడ్యములేల శంకరా. 53

ఉ. ధర్మములేనిచోట ఘన, దాతలుగాననిచోట భక్తి స
త్కర్ములులేనిచోట పర, కాంతల చింతనచోట దండిగా
దుర్మతులుండుచోట పరదూషణజేసెడిచోట నన్ను నీ
కర్మమిదంచు నుంచకము, కామితదాయివిగాదె శంకరా. 54

ఉ. శక్తికొలంది నీభజనసల్పుట నిత్యము నాదువంతునఁ
ముక్తికిదారిజూపి నగుమోమున గాచుట నీదివంతు నీ
భక్తిని వీడకుండ దమ భక్తుల గొల్చుట నాదువంతు న
వ్యక్తుడ నన్నుగాచుకొను వంతతి నీదెగదయ్య శంకరా. 55

ఉ. వంచనజేతువా హరశివా రజతాద్రినివాస నన్ను నీ
పంచనుజేర్చవా పతితపావన పార్వతినాథ వేడ్కతో
పంచశరారి పార్థనుత బాపుము వేగమె నాదు బాధలఁ
వంచనలేమి లేక ఫలవంతముజేయవె జన్మ శంకరా. 56

--: కిరాతార్జునీయము :--

ఉ. పాశుపతాస్త్రమున్పడయ బాండవమధ్యము డింద్రకీల శై
లేశుపయిన్ దపంబు రచియింపగ వాని బరీక్షసేయ నీ
వేశ బరుండవైతి వుమయే శబరీశ్వరి గాగవేదముల్
భాసిలజాగిలంబులుగ ప్రస్తుతిపాత్ర పదాబ్జ శంకరా. 57

చం. భుజబలశక్తియున్నహము భూరియలక్ష్యత జూపిబోరు నా
విజయు నకుంఠితప్రతిభ విస్మయమోదముదోప క్షీరా
ధ్వజకమలాసనాంగి రసవాసవముఖ్యులు సంస్తుతింప నా
సుజనునకిచ్చితీవపుడు సొంపగు పాశుపతంబు శంకరా. 58

--: సిరియాలుడు :--

ఉ. కంజదళాక్షిగూడి శివ। కంచికినేగి సురేశుజేరి యో
కుంజరవాహనా విను మ। కుంఠిత రాజసమొప్ప వృష్టిచే
రంజిలజేయు మీనగరి। రాతిరియున్ బవలన్న యాజ్ఞకుం
రంజలి పట్టిమెల్ల సురరాజతివర్షమునింపె శంకరా॥ 59

చ. జలమయమౌటచే దనకు। శైవమతస్థు డలభ్యుడై
యలతవహించి శెట్టి సిరి। యాలకుమారుని తండ్రియం తదా
నలమటతోడ గంచిపురినంతయు దా దిరుగాడి గాంచెనిన్
లలిత శివాసమేతు శిథిలంబగు నాలయమందు శంకరా. 60

చం. అతిథివి గమ్మటంచు మిము యాదరమొప్పగ వేడినంత స
మ్మతమును జూపివచ్చి నరమాంసముగోర సరే యటంచు స
మ్మతిని గుమారుజంపి తలమాంసము పక్వముజేసి మీకిడన్
కుతుకమునన్ గుమారునొడగూర్చి పరంబిడినావు శంకరా॥ 61

--: సంకల్పము :--

చం. పశువులలోన నే నొకడ। పాలనసేయగ వేడుచుంటినో
పశుపతినామ, పామరుడ। పాపభయంకర పార్వతీపతే
ముశిముశినవ్వుతో వెలయు। మూర్తివిగా? ననునేలుమయ్యయో
శశిధర కావుమయ్య నను శాశ్వతధామమొసంగి శంకరా॥ 62

చం. తెలియగనేర నీ తెఱవు, తెంపి సుమంతయు లేక తృష్ణచే
దెలివి విహీనతన్ ఝషము దెంపున గాలముజిక్కుభంగి యీ
మలినదురంత పాతక సమన్వితమాయను జిక్కుకొంటినన్
గలుషవిదూరుజేసి యిక గావుము మార్గముజూపి శంకరా॥ 63

చం. పలువురు నన్నుజూచి కడు పందన నీబరిహాసమాడ నీ
తులువ యభీరుడుగ్రు డతిధూర్తన నీబహునిందజేయ నీ
నలువురుమెచ్చ నీయెదుట నందలవంచి నమస్కరించ నీ
వలదిలదూషణస్తుతులు భవ్యుడ నీకృపజాలు శంకరా॥ 64

చం. ఒరులసమాశ్రయించుటననొప్పదు నామది యెంతచూచినన్
బరువుడిబోవునంచు బెరవారినిజీరను మాటిమాటికిన్
యరమరజెందు నాహృదయ మన్యులయండకు జేరగోరినఁ
శరణము నీపదాంబుజమె జన్మశతంబులకైన శంకరా॥ 65

చం. అగుపడరావదేమి యఖిలాగమవంద్య భవానిగూడినీ
నగుపడరావ మత్తవృషభాశ్వమునెక్కి మహాదయాబ్ధివై
యగుపడరావనాకు సురయక్షగణార్చిత నవ్వుమోముతో
వగుపడరావ నిత్యమును నర్చనజేయుదునయ్య శంకరా॥ 66

చం. దొరలనువీడి భత్యులకు దొసిలియొగ్గుట యెంతో యట్టి నీ
పరమపవిత్ర పాదములపట్టుటమాని యపాత్ర మిాప్రజఁ
నిరతముగొల్చుటం తెఫలమౌ రజితాద్రినివాస గావునఁ
వరదుడవీవెయంచు తమపాదము లర్చనజేతు శంకరా॥ 67

--: దక్షాధ్వరధ్వంసము :--

చం. జనకుడుజేయు యజ్ఞమును జండిక ॥ జచ్చరజూతునంచు తా
మనమున యించుకంతయును మానములేక జనంగ నొక్కరున్
జనులను జూడకుంట మది గాయముబొందెను వీడె దేహముఁ
ఘనమగు నుగ్రమూర్తివయి జంపితి దక్షునినాడు శంకరా. 68

--: మన్మథసంహారము :--

చం. అసవులువీడి జన్మమున నద్రిసుపుత్రికయై జనించి తా
నసమమహాతపంబు రజితాద్రినె సల్ప। ననంగు డార్భటిన్
కుసుమశరంబులఁ విడువ కోమల నీదుమనంబుమార్చగా
నొసటనను్న కంటిసెగనుంచిన, మారుడుజచ్చె శంకరా॥ 69

చం. జలధరుదర్శనార్థమలబాతకిబోలె మహావిచారముఁ
దెలుపుచు, తల్లిరాక కతిదీనత జూచెడి లేగలట్టులన్
జలరుహముల్ ప్రభాకరునిజూడకు జూచుతెఱంగు నిత్యమున్
గలతవహించియుంటి నిను గన్నుల జూడగ నేను శంకరా. 70

చం. మనసునశాంతిలేదు తగుమార్గముదోచుటలేదు శాంతికై
మనుజులనాశ్రయించు టవమానముగాదె యధర్ములౌటచే
గనరు యదార్థమేదో తమకన్నులభేషజమేదో, గానన
న్ననువగుచోటుఁజేర్చి మనమందు ప్రశాంతిని నిల్పు శంకరా. 71.

చం. మరపా? ఈశ్వర లేక నీకు నలుకా? మన్నించి కాపాడనఁ
వెరపా? నీకది భారమా? పురహరా! వేవేగ రక్షింపవా?
కరముల్ మోడ్చి నుతింతు నిన్ను కరుణన్ గానంగ కామ్యార్థినై
కరుణాసాగరకావుమయ్య నను నీకన్దోయితో శంకరా॥ 72

మ. తరమే బ్రహ్మకునైన నీఘనమహత్త్వంబెన్న నోయీశ్వరా
పరమోత్కృష్టతపోధనుల్ సులువుగా వర్ణింపగానేరరా
సురగంధర్వ కవీశ్వర ప్రముఖులే సొంపార గీర్తింపనే
రరుగా వ్యర్థుడనెన్న నాదువశమా రమ్యంబుగా శంకరా॥ 73

మ. వలదాత్మస్తుతి లుబ్ధజీవనము, పాపప్రాయసంగంబులన్
వలదాచార్య తిరస్కృతుల్ వలదు సద్బంధుత్వవర్జంబులుఁ
వలదర్థిప్రజదూషణంబులును, కోపప్రాప్తితాపంబులున్
వలదీజన్మకు నాకువద్దిటులు నన్ బాలింపుమో శంకరా. 74

మ. వలదన్యాయ మపారతృష్ణ దురిత, వ్యాపారమర్థార్జనల్
వలదప్రాచ్యజనప్రశంస పరభా,మస్తోత్ర నిందాదులున్
వలదుర్వీసురదూషణంబులు సయుద్వాహప్రణాశంబులున్
వలదీజన్మకు నాకు వద్దివికనఁ బాలింపుమో శంకరా॥ 75

--: గర్భస్థము :--

నవమాసంబులు తల్లి గర్భమున, నానారోతలన్ జిక్కి నా
కవకాశంబిసుమంతలేక బడితిఁ హా కష్టముల్ భీతితో
నవమాసంబుఘటిల్లెఁ జాలునిక, నాకాగర్భవాసంబునన్
నివసింపన్ బనితీర్చి కావుమికనఁ నీసత్కృపన్ శంకరా॥ 76

--: శిశువు :--

మ. మలమూత్రంబులతో మహాభయముతో, మాతృస్తనాపేక్షతో
ఛలమూర్ఖత్వముతో సదాభ్రమతతో, చాంచల్యచిత్తంబుతో
బలువైనట్టి కఫజ్వరగ్రహమహా, బాల్యామయశ్రేణితో
కలనైనఁ తమచింతలేక చెడితిన్, గామ్యార్థినై శంకరా॥ 77

--: బాల్యము :--

శా. బాలక్రీడల సల్పుచున్ బడులలోఁ బాఠంబు వల్లింపుచున్
బాలోద్యానకబోధనావిధములన్, బాగొప్ప నాలించుచున్
లీలానాటకవృత్తగీతపఠనన్, వీనుండనై బుచ్చితిన్
బాలప్రాయము నీదుచింత నెఱుగఁ ప్రారబ్ధమా శంకరా. 78

--: యౌవనము :--

ఉ. యౌవన మంకురించగనె, యిన్యులనెట్టుల నాశ్రయించుటో
పావనమూర్తులంచు పరిపాలకుల న్నుతియించుటెట్టులో
జీవికి విత్తమే భువిని, జీవనమంచు నదెట్లు గూర్చుటో
యేవిధమేదిదారియని యెంచుచుబుచ్చితినయ్య శంకరా. 79

--: వార్ధక్యము :--

శా. వార్ధక్యంబున మోహమూర్ఖతలచే, వాతాదిరోగాలచే
వ్యర్థంబైచెడు వాక్ప్రవాహములచే, వాత్సల్యచిత్తంబుచే
యర్థధ్యానముచే మహాభ్రమతచే॥ హాస్యప్రసంగాలచే
స్వార్థంబే పరమార్థమై చెడుదు రీ, స్వార్థప్రజల్ శంకరా. 80

--: అవసానస్థితి :--

ఉ. కాయమువీడి జీవుడతి। కంపితచిత్తతనేగుచుండ నో
నాయనయంచునేడ్చు నిజ। నందననందినులైనగాని క
న్దోయిని భాష్పముల్ తొలుక। దుఃఖమహాంబుధిజొచ్చుపతియుఀ
గాయమువీడిరారుగద। కర్మము పుణ్యముదప్పి శంకరా. 81

ఉ. జీవితమెంచిచూడ యొక। చిన్ననిబుద్బుదమట్టిదెక్కడో
యేవిధమెట్టులోమడయు టేరికినైన నెఱుంగశక్యమే
జీవియనర్ఘమైన ఘనచింతనవంతల చాలుగాక తా
నేవిధమైనగాని నినునిచ్చనుగొల్చుటె బాగు శంకరా. 82

మ. కఫవాతజ్వర పిత్తదోషములచే గన్జాపులేకుండునో
చపలాత్మస్థితి కల్గునో భయముచే శంకింతునో కామమో
హప్రమాదంబుల జిక్కి నిన్ మరతునో యావేళకున్ గాననీ
జపముఀ జేయుదు నిప్పుడే యభవ నే సద్భక్తితో శంకరా. 83

--: గంగావతరణము :--

మ. రంగత్తుంగతరంగ సంఘములతో। రంజిల్లు ఘోషంబుతో
పొంగారంబగుపొంగుతో నుఱగతో పువ్వాటుతంపర్లతో
భంగుల్బూపుచుజెంగలించు చునభోభాగంబునందుండి జా
ఱఀ గంగమ్మనుదాల్చి తేశిరమునన్ రంజిల్లుచున్ శంకరా. 84

మ. ఇలకున్ గంగదరంగ ఘోషణముతో నేతెంచునద్దాని ని
శ్చలవాత్సల్య ముఖారవిందముతో నా, శర్వాణివీక్షింప నీ
దలపైదాల్చి భగీరధుఀ మనపవే తత్కామితంబిచ్చి నీ
చలమున్ వీడక నాదుకోర్కెయు తగన్ సాధింపుమో శంకరా. 85

మ.అరయఀ మన్మధుపత్నిపై విజయుపై యాయంబపై చెంచుపై
కరిపై కాళముపై భగీరధునిపై, కాగోదరశ్రేణిపై
బరగన్‌గల్గుభవత్కృపారసము నాపై కొంతరానిమ్ము నీ
చరణాబ్జంబులు నమ్మినాను। జగధీశా కావవే శంకరా. 86

--: క్షీరసాగరమథనము :--

మ. సురదైత్యుల్సుధఁబొందు తెన్నెరిగి యాక్షీరోదధిఁ జొచ్చి మం
దరశైలంబునవాసుకిన్ వరుసగాత్రాడంచు దాచుట్టి సా
గరమున్ జిలవిషాగ్నులంబరమునన్ గప్పంగభీతాత్ములై
సురలర్థింపగ నాభిమ్రింగితివిగా జోద్యంబుగా శంకరా. 87

మ. నటరాజేశ్వర నన్నునేలవు దయఁ నాపాపమా? భారమా?
యటవిన్గాచిన వెన్నెలయ్యె నిటునా యభ్యాసమన్నింట న
న్నెటు మన్నింతువొ నీదె భారమని నిన్నే ప్రొద్దుపూజింతు నీ
వెటులైనన్ తగుమార్పుజేసి జయమీవే తండ్రియో శంకరా. 88

--: త్రిపురాసుర సంహారము :--

మ. మయసన్నిర్మిత పట్టణత్రయమునన్ మాయావులైజొచ్చి ని
ర్దయతన్ నిర్జరలోకవాసులను నిర్ధ్వంసంబుగావింపగా
భయవిభ్రాంత విచారచిత్తముల నిన్ బ్రార్థించు నాదిత్యులన్
దయతో నేల సురారిపట్నముల నిర్దాహించితే శంకరా. 89

మ. విశిఖంబయ్యె మురారి నీవుపురముల్ విధ్వంసముఁ జేయుచో
వశముఁ జేసుకొనెంగదయ్య హర! నీవాత్సల్యచిత్తాబ్జముఁ
పశిమింపారతను ప్రభల్ జెలగ నావైకుంతుడేమోహినీ
శశిబింబాననయై విచిత్రగతులఁ సద్భక్తితో శంకరా. 90

మ. ననుదాక్షాయణియంద్రు మానవులు తన్నామంబునేగోరనో
సనకాదిప్రముఖార్చి తాంఘ్రి యుగళా సద్భావయుక్తుండవై
జననస్థానమొకండు వేడెదను నే జన్మాంతరంబిమ్ము నా
కనునప్పార్వతిగోర్కె తీర్చితివిగా హర్షంబుతో శంకరా. 91

మ. సనకాదుల్ భవదీయ పాదములకున్ సద్భక్తితో మ్రొక్కుచుఁ
మనసారన్మిముపూజసేతు మెపుడుఁ మార్గంబు బోధింపవే
యని నిన్వేడిన వేదసారము కడున్, హర్షంబుతో బోధనల్.
మనమింపారనొనర్చితీవుగద సన్మానంబుతో శంకరా. 92

మ. దయసేయంగదె ముక్తిసాధనము నోదక్షాధ్వరధ్వంసకా
దయనేలంగదె? దాపుజేర్చిన గజాతాత్మేశ్వరా నిత్యమున్
భయమున్‌బాపవె! ధైర్యమిచ్చి దయతో బాల్గొన్నగార్యంబునన్
జయమున్ గూర్పగరావె! వేదనుతయాజాగేల నో శంకరా. 93

--: కుమార సంభవము :--

మ. భయవిభ్రాంత విషాదచిత్తములతో స్వర్వాసులేతెంచినఁ
దయతో నొక్క సమర్థు మాకొసగి యాదైత్యాథమున్ ద్రుంచిమా
భయముల్‌బాపవె? యంచుదైన్యమున నిన్‌బ్రార్థింపహర్షంబుతో
రయముఁ షణ్ముఖునిచ్చి యాత్రిదశులన్ రక్షింపవే శంకరా. 94

--: ఇంద్రియముల ఫలితము :--

మ. భవదీయార్చనలేని హస్తములు నీ, భవ్యంపురూపంబు చి
త్తవధానంబున జూడజాలని కనుల్ దాల్మిఁ భవత్ సత్కథా
శ్రవణానందము లేని వీనులును నీసాన్నిధ్యమున్‌గోర నీ
భవముఁ దండుగగాదె సత్యమరయన్ భక్తప్రియా శంకరా! 95

--: సంకల్పము :--

మ. కరులఁ గోరను ధేనువుల్‌వలదు నేకాక్షించ నేసౌథముల్
పరమానంద మొసంగు పుష్పవనముల్ భాగ్యంబునేగోర స
ద్బిరుదుల్ కాంచనఘోటక వ్రజములుఁ చేరైననర్థింప నీ
చరణద్వంద్వము చెంతనుంచు నను నీజన్మాంతమున్ శంకరా. 96

మ. తగనా? సుందరమందహాస భవ నీదాస్యంపు భాగ్యంబు కై
తగనా? చంద్రకళావతంస తమ సద్గాసావళిఁ స్పర్శకుఁ
తగనా? పాపవినాశయీశ నినుసందర్శింప నీజన్మకున్
తగనా? చిన్మయరూప చింతసలుపన్ దాసుండనై శంకరా. 97

మ. అగచాట్లేలిటుబెట్టుచుంటి వివి నీకానంద సత్క్రీడలా?
తగయా? లేక పరీక్షయా? పశుపతీపాలింప సంకోచమా?
తగుమార్గంబెటుదోచలేద? యిక నాతాపత్రయంబార్పుమా?
జగమేలంగలవాడవే యరయ నీజాగేలనో శంకరా. 98

మ. రథమైయొప్పు మదీయకాయమరయఁ రమ్యంబుగా మీకు నా
మదమాత్సర్యయు తేంద్రియాశ్వములు సన్మార్గంబునఁ బోవవీ
హృదయంబే భవదీయపీఠమనుచుఁ హృష్టుండవైనీవయీ
రథచోదత్వ మొనర్ప వేడెద సదా రంజిల్లుచుఁ శంకరా. 99

మ. అపరాధిన్ననునిగ్రహింపకుము నన్నానందసంధాయికా
కపటాత్ముండని కోపమొందకుము యోకాశీపురాధీశ్వరా!
చపలాత్ముండని సాకుజెప్పకుము యోసర్వజ్ఞ సర్వోత్తమా
నెపముల్ జూపక నన్ను బ్రోవగదవే నిత్యంబునో శంకరా. 100

--: కామము :--

ఉ. ఏలచొరంగనిచ్చితివో యీఘనతృష్ణను మానసంబునన్
శీలముపోనడంచు, తనుజీరనివారల నాశ్రయించు త
న్మూలమునన్ నశించు నభిమానము శౌర్యము దాననందరున్
బేలనుజేతురయ్య ఘనభీకరశత్రువు వద్దు శంకరా. 101

--: క్రోధము :--

శా. ధర్మాధర్మమెరుంగ నీదఖిల విద్యాధిక్యతల్‌బాపు, ఛీ
దుర్మార్గుండనిపించు బంధువులకున్ దుఃఖంబు సంధించు, తాన్
మర్మంబించుకలేక మందునివలెఁ మాత్సర్యముఁ బెంచుదు
ష్కర్మాధీనము కోపముం గెడపి నన్ గాపాడుమో శంకరా. 102

--: లోభము :--

ఉ. ఈవిసుమంతలేదు ధనమెప్పుడు నార్జనజేయబూను నా
దైవమెసాక్షియంచు కడుదైన్యముజూపుచు సంచరించు తా
బావనమైన యంబరము పట్టెడుబోనము నిచ్చగింపడా
జీవుని నట్లు లుబ్ధునిగ జేసితివేమి? మహేశ శంకరా. 103

--: రోగము :--

ఉ. భోగము బుగ్గిపాలు కడుభుక్తికి ముక్తికి లోటు వచ్చు సత్
త్యాగముసున్న వాంఛయతి దారుణమిన్నిట యర్థనాశముల్
వేగమె జచ్చుటే సుఖము వేగుట భారమటంచుదోచు ఛీ
రోగమెరోత దానినిక రూపముమాపుము నీవు శంకరా. 104

ఉ. ఇంతకుచాల ధన్యుడనహీందుకళాధర యేలయందువా
సంతస మద్భుతంబునది సత్యము నాదెస తేరిజూచినన్
పంతముతోడనీవు నను బాలనజేసి మదీయరుగ్మతఁ
సాంతము శాంతిజేసీ జపసాధనమిచ్చితిగాదె శంకరా॥ 105

మ. అరిషడ్వర్గములఁ జయించి కడు నాహ్లాదంబు దీపింపగా
కరముల్మోడ్చి భవత్కృపారసముకై కాక్షించుచున్ ధ్యానముల్
నిరతంబున్ గడు నిష్టతో సలుపు మౌనివ్రాతమే ధన్యమో
కరుణాసాగర నాకు నిమ్ము దయతో గామార్థముల్ శంకరా॥ 106

ఉ. అందరికంటె హీనుడ మహాల్ప మనస్కుడ శుద్ధ మందుడఁ
యందనిపండ్లకే శిశువు లఱ్ఱులు జాచినభంగి సుందరీ
నందన సౌధ హేమముల యార్జన మెవ్విధిజేతునంచు మో
హాంధుడనై భవత్పద సయర్చన మానితిగాదె శంకరా. 107



కైలాసవాసులు

**శ్రీ చాగంటి సుందరశివరావు గారు, శ్రీమతి సుశీలమ్మ గారు**

సీ॥ ఆత్రేశగోత్రుండనై ఆరాధ్యకులమున
యాజుషశాఖలో నవతరించి
విద్యాధికుండగు-వీరశరభయాఖ్యు
డస్మత్పితామహుం డతని సుతుడు
రాజకీయోద్యోగి-రాజన్న తనయుండ
పేరమ్మ యనుసాధ్వి పేర్మిసుతుడ
సత్యనారాయణ, శరభ సాంబశివాఖ్యు
లస్మదీయాగ్రగజులనగ బుద్ధు

తే.గీ. లరయ భాస్కరశాస్త్రి నా యనుగు తమ్ము
డఖిల విద్యల గురుడవౌ-యలరుదేవ
యభవ సుందర శివనాము-డంద్రు నన్ను
కరుణ నేలుము విశ్వేశ-కాశికేశ॥

మోహన్ ఆఫ్‌సెట్ ప్రింటర్స్, కాకినాడ. ఫోన్ : 2361419